మో- పరలోక మనియెదు ♦ వైకుంఠ మనియెదు
చొచ్చి నీ వెపుడైనఁ ♦ జూచియుంటె ?
రు- చూడఁగోరిన ఘనుల్ ♦ సొంపు దీపింపఁగా
జ్ఞానదృక్కులచేతఁ ♦ గాంచలేదె ?
మో- భావిసౌఖ్యము నమ్మి ♦ ప్రత్యక్షమున బాధఁ
బడఁగోరు టెందైన ♦ భావ్యమౌనె
రు- ప్రత్యక్షమనునది ♦ భ్రమకాదె ? యంతలో
హరియించు నంచు నీ ♦ వరయవొక్కొ
మో- కాసుచేయని హరి ♦ వాసరవ్రతకాంక్ష
బాలుని ఖండింపఁ ♦ బాడియౌనె ?
రు- హరివాసరమహత్త్వ ♦ మరయంగ మనబోంటి
స్వల్పబుద్ధులకెల్ల ♦ సాధ్యమౌనె ?
మో- గీ. భ్రూణ శిశుహత్య లివి నీకు ♦ ముక్తిదములె ?
రు- ముక్తి యన నెద్ది ? రాగ వి ♦ ముక్తి కాదె ?
మో- ఎట్టి ఘనుఁడవు ! హా స్వర్గ ♦ మెదుర వచ్చు !
రు- స్వామికృపకన్న మఱివేఱె ♦ స్వర్గ మేడ ? 33

మోహి—(హాస్యముగా) అవు నవును రాజా. స్వామి నీకుఁ బ్రత్యక్షము కాఁబోవు చున్నవాఁడు. ఇటు వినుము.

సీ. తనని యోజనశాలి ♦ ననుకొను మానవుఁ
డొరుల మాటలఁ జెవి ♦ యొగ్గి వినఁడు
వినెనుపో దానిని ♦ వికటంబుఁగా నెన్ను
నెన్నెఁబో వారల ♦ హీనపఱుచు
పఱిచెఁబో మరలఁ జె ♦ ప్పఁగఁబూను బుద్ధిని
జెప్పెఁబో వారలఁ ♦ జెనఁటు లనును

పలుమారు నీరీతిఁ ♦ బటువశార్ఖల్యవిస్ఫూర్తి
క్రిందు మీఁదరయక ♦ కెరలివడుచు

గీ. పనులు చెడిపోఁగ, నపకీర్తి ♦ పైకి రాఁగ,
ధైర్యమును లోఁగ, వ్యసను చి ♦ త్తంబు వేఁగ,
చింత లోఁగి మూఁగ, వేడ్కలు ♦ చీలి సాఁగ
దైవమును దూఱు కుజనుండు ♦ తవిలి తవిలి. 34

ఇట్టివారిని లోకములో నెందఱఁ జూచుటలేదు రాజేంద్రా!

రుక్మాం—నీవొవర్చెడి సుబోధ నేను వినకుండినందులకా యిట్టు లాడుచుంటివి?

మోహి—సుబోధలని వన్నాక్షేపింప నేల? నీ వభిమానించెడి యా శాస్త్రాభిప్రాయములనైనఁ జక్కఁగా మన్నించితివా?

రుక్మాం—మన్నింపక యేమొనర్చితి?

మోహి—ఏమొనర్చితివో నీ వెఱుఁగవా?

రుక్మాం—అట్లనెదవేమి! నేను శాస్త్రవిరుద్ధముగఁ బ్రవర్తించుచుంటినా?

మోహి—నీప్రవర్తన శస్త్రసమ్మతమగుటచే శాస్త్రసమ్మతమని యనుకొనుచుంటివేమో.

చ. తనయుఁ డితండు, రాజ్యపద ♦ దక్షుఁడు, కీర్తివిశాలుఁ డాపయిన్
జనక సుశాసనానుగ వి ♦ చారుఁడు, ధీరుఁడు, ముందుముందు మీ
కనువగు పుణ్యలోకఫల ♦ వాప్తినొసంగెడు దాత, యిట్టి మేల్
గొనములరాశి గూల్చి, యటఁ ♦ గూలెదె పున్నరకాగ్నికీలలన్.

రుక్మాం—అబలా! నీవచనంబులు చూడ పిట్ట కొద్ది కూఁత ఘన మన్నట్లుగా నున్నవి. ఏమంటివి? పున్నరకాగ్నికీలలా? ఏ నెఱింగింతు వినుము.

ఉ. మానసకాంత యల్ల పర ♦ మాత్మవిభుం గొని క్రీడసల్ప, వి
జ్ఞానసుతుండు పుట్టి, భవ ♦ నాశమొనర్చుచుగాని, యేటి య
జ్ఞానము? దేహపుత్రుఁడు ఋ ♦ ణస్ఫుటవేషుఁడు మోక్షమిచ్చునే?
పూనిక వేషధారియగు ♦ భూపతి దేశము లేలఁ జాలునే? 36

మోహి.—నీవంటివానికి హితోపదేశంబు చేయఁబూనిన లోపంబు నాదికాని నీది కాదు.

క. నీతి విడిచి సుతుఁ జంపుట
పాతక మని తెల్పు నాదు ♦ పల్కులు భూపా!
యీ తీరున నీ మనసను
రాతికి గిలిగింతవోలి ♦ రంజిలె నకటా! 37

కానిమ్ము. రాజేంద్రా! నీయిష్టముచొప్పుననే కానిమ్ము. నీకు లేని ప్రేమానుబంధంబు నాకేల? (అని కొంచెె మూరకుండి వారలు వినునట్లు తనలో) అయ్యో! ఊరకుందునన్నను మనసొప్పదే! ఏమియు నెఱుంగని పసిపాపనిఁ బట్టి యన్యాయంబుగఁ జంప నుద్యమించి యున్నవాఁడు. బిడ్డలు కలవా రెవ్వరైన నిట్టి కార్యం బొనర్తురా? (అని జనాంతికముగా ధర్మాంగదుని బిలిచి) నాయనా! బిడ్డా! ధర్మాంగదా! ఇటు రమ్ము. (అని చేరఁదీసికొని) నీజనకుని వాక్యంబులు వినుచుంటివి కదా? నీవును చావున కేల సిద్ధమయ్యెదవు? అయ్యో బిడ్డా! నిన్నుఁజూచిన నాకు ముద్దగుచున్నది. నిన్నుఁ జంపుదురన్న నా గుండెలు కొట్టుకొనుచున్నవి. ఈరాజేంద్రుఁడు లేనిపోనిపంతంబులం బూని నిష్కారణముగా నిన్ను జంప నుంకించుచున్నవాఁడు. వీరల జోలి నీకేల? చిరంజీవివై నాయొద్ద సుఖంబుగ నుందువు రమ్ము. ఆవులు పోరాఁడి లేగలకాళ్లు విఱుగఁ ద్రొక్కి నట్లున్నది. తాను వ్రతము విడువఁడఁట; దానికి బదులు నిన్నుఁ జంపెదునఁట! ఇట్టి యన్యాయ మెచ్చటనైన నుందునా?

గీ. రాచధర్మంబు న్యాయంబు ♦ రట్టుపాలు
చేయఁ జూచెడు నీ యయ్య ♦ చేతఁ జిక్కి
బాధ లక్లేల పడియెదు? ♦ ప్రాణ మున్న
బలుసుకూరను దినినైన ♦ బ్రదుక లేవె? 38

ఇంతకుముందు స్వర్గమేమో కల్గునని చెప్పుచుంటివి. అయ్యో బిడ్డా! ఇది యెట్టి వెఱ్ఱితలంపు! మతిపోయి పౌరాణికులు చెప్పెడి వచనంబు లేమైన విని యుంటివా? ఏమియు నెఱుంగని పసికూనకు నీకీ గాథలన్నియు నేల నాయనా? జనకునితో 'నే నీ చావున కొప్పుకొనను' అని చెప్పుము. దానిపయి జనకుం

డలంగుసెద నిన్ను వారొద్దని యెంచుకొనిరొంచ. నీకుఁ గొదవేమి ఓడ్డా! నా మాట వినుము.

ధర్మా—(స్వగతము) అయారె!

చ. అమలచరిత్రుఁడౌచు, సుజ♦నావళిచే నుతిఁగాంచు, మేటి నే
మమున వ్రతం బొనర్చు. బుధ♦మానితుఁడౌ జనకుండు దుష్టస
త్తముఁ డఁట క్రూరుఁడౌ నఁట! వ్ర♦తంబులు కల్లఁట! యింతెకాక, యీ
యమ ననుఁగాచి పెంచునఁట♦యారా! బళారె దయార్ద్రవాక్యముల్.

(మహాజనుల నుద్దేశించి) ఓ సుజనాగ్రగణ్యులారా!

చ. వ్రతము మహత్తరంబు, ఘన♦పాపహరంబు, సురార్చితంబు, నా
శ్రితజనకల్పకంబు, నల♦శ్రీశుప్రియంబు, శుభప్రదంబు, నీ
కృతికయి మేనిఁబాయు టది♦కీడఁట! గోడఁట! యిట్టి కాయమే
సతమఁట! వింటిరే జనని♦స్వార్థపరైకమహాప్రసంగముల్. 40

(పరిహాసముగా) జననీ! [81]

సీ. తల్లిదండ్రులకన్న ♦ దైవమే లేఁడని
పలుమారు పెద్దలు ♦ పల్కుచుండ
నక్కటా! వారల ♦ యభిమతంబునకు నే
ననుకూలుఁడనుగాక ♦ యదరి బెదరి
నీతంత్రవాక్యముల్ ♦ నిజమని మది నిడి
యిప్పటి ముప్పును ♦ దప్పుకొనిన
క్షణభంగురమగు నీ ♦ కాయంబు నెన్నాళ్లు
భద్రంబొనర్చి కా♦పాడఁగలము?

గీ. నీవు, నేనును, మఱిఁగల్గు ♦ నిఖలజనులు
నెప్పుడో, యెట్టివేళనో ♦ యెట్టిగతినో
ఏ రుజలఁ జిక్కువడియొ యా ♦ మృత్యువాతఁ
బడుదుమే కాని యది తప్పి ♦ బ్రతుకఁ గలమె? 41

అట్లు వ్యర్థంబుగ మృతినొందుటకన్న నీ హరివాసరదిన[illegible] వ్రతనిర్వహణార్థంబుగ మేనిఁ బాయుట మేలు కాదే? జననీ! ఇట్టి పుత్త్ర[illegible]ంపుము.

మోహి—ఓయబ్బ! యీనీతులన్నియు నెప్పుడు నేర్చితివోయి! ఇవి యన్నియు జావఁబోయెడువాని కుండునీతులే. ఔను. పైత్యరోగికిఁ బంచదార విషమగునట్లును దివాంధమునకుఁ బగలు పరిపహనియట్లును, యువతీలోలునకు హరికథాలాపం బనిష్టమగునట్లును నా వచనంబులు నీకుఁ గేవసమన్నవి కాఁబోలు. అవు నవును.

ఉ. అంబరవీథి నేగుచు, ర • యంబున భూమిని గల్గు మాంస ఖం
డంబును గాంచఁగల్గెడి దృ • ఢంబగు దృక్కులు గల్గు పక్షు లు
గ్రంబగు మృత్యువాతఁబడు • కాలము డాసిన యట్టివేళ పా
దంబులముందు గల్గు నురి • త్రాళ్ళను గానఁగఁజాల వక్కటా! 42

అట్లే నీకును జావు సమీపించుటచేతనే నా వచనంబులు కర్ణశూలంబు లగుచున్నవి. పోనిమ్ము. నీకు లేని బాధ నాకేల? ఎద్దునకు లేని బెదరు గానుఁగ కుండునా?

రుక్మా—జనకా! ఈ నాతీమణితో నిట్లు వృథాప్రసంగంబులఁ గాలంబుఁ గడుప నేల? సత్వరంబున నన్ను ఖండించి నీవ్రతంబు నెఱవేర్చుకొమ్ము. తడవగుచున్నది.

రుక్మాం—అట్లే యొనర్తు పుత్త్రకా! (అని మోహినిం జూచి) తరుణీ! నీవు కోరినట్లే పుత్త్రు నిప్పుడే ఖండించి నావ్రతంబును సాగించుకొనఁ బోవుచున్నవాఁడ.

మోహి—రాజేంద్రా! నన్ను బెదరించెదవా?

క. కొడుకును జంపెద ననుచును
బుడబుడలాడెదవు; చంపు; • పో; నాకేలా?
గుడినుండు గంట పోయిన
నడుమ నచటి నంబికేమి • నష్టము చెపుమా? 43

వ్రతంబు విడువుమని యెంత చెప్పినను వినక పుత్త్రుని ఖండింతు ననుచుంటివి. నీకు లేని దయారసంబు నాకేల? నీయిష్టముచొప్పుననే కానిమ్ము. (అని తనలో) ఈతఁడు నిక్కంబుగ సంహరించు నేమో. సంహరించిన — ఫల మేమి? ఇచట కర్తవ్యాంశంబు పుత్త్ర[illegible] కాదా. కాని యీ నక్షత్రయంబునఁ

జూడ పుత్రీమణం బత్యధికబాధకం బని మహావిరాగులు తత్త్వజ్ఞులుకూడ నపలుచుందురు. ఈతఁడూరక బింకంబు లాడుచుండెఁ గాని కదిసి వధింపఁబోవ నీతని హృదయం బదరక యుండునా! ఒకవేళ దిట్టరియై గట్టితనంబునఁ బట్టి వధించు నేమో. ఈశిశుహత్యాపాతకంబు నాకేల? అయినను దేవతాప్రేరణంబునఁ గదా యే నిట్లు పూనితి. వారిట్టి దురంతంబుం జూచి సహింతురా? ఈసచ్చరిత్రు నిట్టి యకారణదుఃఖంబున ముంతురా? తగిన వెఱవొక్కటి యోజింపక విరమింతురా? కానిమ్ము. ఏమగునో చూచెద.

రుక్మాం—పుత్రికా! నీవీ బల్లపైఁ బరుండుము.

ధర్మాం—చిత్తము. అట్లే చేయుదును. (అని పడుకొనుచున్నాఁడు.)

రుక్మాం—(ఖడ్గము చేతఁబుచ్చుకొని యొద్ద నిలిచి) అహా! ఖండింపఁబోవ దేహము కంప మొందుచున్నదే!

తురంగప్రయాతము.

ఔర, యెంతకార్య మయ్యో! ♦ నాత్మజున్ వధించు నీ
క్రూరకర్మ మెట్లొనర్తు ♦ గోపికామనోహరా!
చేరి వీనిఁ ద్రుంపఁబోవఁ ♦ జేతులాడ వక్కటా!
యూరకున్న సద్వ్రతం బ♦హో! వృథాయగుం గదా.

అఁ ఏమీ! ఏ నిప్పుడు పుత్రీమణీప్రతిబంధంబున వ్రతం బుజ్జగింతునా! కట కటా, చిత్తమా! నీకీ భ్రాంతియేల?

ఉ. పుత్రుఁడు పుత్రుఁడం చకట! ♦ పొక్కెదు నీవిటు మాటిమాటికిన్
పుత్రుఁడు నీవు నొక్కతఱిఁ ♦ బుట్టిరె? యొక్కటఁ జావఁబోదురే
పుత్రుఁ డెవండొ నీ వెవరొ ♦ పుట్టక పూర్వ; మొకింత నేఁడు నీ
పుత్రుఁ డనంగనే భ్రమసి ♦ మున్గెదె మోహమహాంబురాశిలో.

ఉ. ఎందఱు పుట్టరీజగతి? ♦ నెందఱు కల్గరు? మున్ను పుత్రులం
జెందఱు భ్రాంతిఁ జెందరు? గ♦ణింపుము వారలు చావకుండిరే

వందలు నేయు వస్తుధన ♦ వాహనముల్ వెనువెంటఁ బోయెనే?
కొందలమందె దేల విన ♦ గూడని కల్లజగంబు నమ్ముచున్. 46

కవిరాజ విరాజితము.

సతిసుతసోదర బంధుహితాదుల♦సంఘమునందలి భ్రాంతిని నీ
గతి వెతనొందుట మాఢ్యమనందగుఁ♦గాదె? వివేకుల కార్యమె, హా
హితవుగఁ దెల్పిన సద్గురుబోధ యి♦కింతయు నెవ్వడు వీడకు వే
సుతుని వధింపవె; శోక మడంప♦వె; నూటి పరాత్పరునం దిడవే.

మోహి—(తనలో) ఔరా! ఈతని వైరాగ్యం బెంతయుఁ గొనియాడఁదగి యున్నది. నాయత్నం బిప్పటికి వ్యర్థమైనట్టులే యున్నది.

రుక్మా—పుత్రికా! ఇఁక సిద్ధంబుగ నుండుము.

ఉ. హా పరమాత్మ! యాశ్రితజ ♦ నావన! యచ్యుత! దీనవత్సలా!
యీ పసికూన దోష మొక♦యింతయెఱుంగఁడు; మద్వ్రతార్థమై
యీ పరమేష్ఠిపుత్రి వధి♦యింపుమటన్నను నిట్లు ప్రాణిలన్
పాపవిదూర! వీనినిఁ గృ♦పామతి నీదరిఁ జేర్చి కావవే. 48

(అని యొక్కవ్రేటు వేయఁగా కంఠమున కేమాత్రము బాధఁ గలిగింపక యే ఖడ్గము విఱిగిపోవుచున్నది. దీనిచేత రాజు విస్మయంబంది తనలో)

అక్కటా యిదియేమి యాశ్చర్యము! రణరంగమం దనేకులకు శత్రురాజుల శిరంబులెల్ల ఖండతుండంబులుఁగ నఱకి వన్నెకెక్కిన యీ యాయుధం బిట్టి లీ పసిబాలుని కంఠముపై వేసినమాత్రంబున విఱిగిపోయెనే? ఇందు కేమనవచ్చు? (అని దానిం జేతఁగొని) అక్కటా ఖడ్గమా! యిట్లు తునియలైతివా?

చ. సమరమునందు శత్రువుల♦సత్యవిదూరులఁ గ్రూరకర్ములన్
గుమతులనెల్లఁ ద్రుంచి నుతిఁ♦గొన్న నినుం గొని నిర్మలాత్మ నీ
సుమసమదేహుఁ ద్రుంపఁగను♦జూచితినం చిరువ్రయ్యలైతె? న్యా
యమ యిది? సద్వ్రతార్థ మక♦టా కరుణించి క్షమించు ఖడ్గమా!

(అని ఖడ్గమునకు మ్రొక్కుచున్నాఁడు.)

మోహి—అవు నవును. ఆ ఖడ్గము ముందే క్షమించినది యీబాలుని. భూపాలా! నీ విచ్చట నొక్క ధర్మం బెఱుంగవలసి యున్నది. ఏమన:- లోకంబున నేరస్థుండగువాం డురిం దీయంబడునపు డాతం డేకారణంబుననైన మృతుండు గానియెడ నాతండు నిజంబున నిర్దోషియనియు, నాతండు శిక్షింపంబడుట సర్వసాక్షియగు పరమేశ్వరుని సంకల్పము గాదనియుం దలంచి యాతని నిర్దోషిగా నిశ్చయించి వారల నురితీయక విడుతురు. ఇది రాజనియతి. ఇట్టి ధర్మానుసరణంబుగ నీధర్మాంగదుం డిపుడు రక్షార్హుండు. కావున నీతని విడువుము. వ్రతం బటుంచి మన మంతఃపురంబునకుం బోవుదము రమ్ము.

రుక్మా—మద్దరాలా! ఈ ధర్మాంగదుండు దోషియని శిక్షింపుమంటివా? ఇపుడు నిర్దోషియని రక్షింప నంటివా? మద్వ్రతనిర్వాహణార్థంబుగ నీతని యాసనాతి చొప్పున నిట్లొనర్చుమంటివి. ఇందు నీధర్మోపదేశంబు లేల? చాలింపుము. (అని విఱిగిన యాయుధము నావలం బడవైచి) సేవకా! విల్లు నమ్ములు గొనిరమ్ము (అని యాతండు తెచ్చి యొసంగంగా దీసికొని) హృదయమా! నీవు కలవర మందకుము.

### ఉత్సాహావృత్తము.

శ్రీధరుండు భక్తవరుల ♦ చిత్తవృత్తు లెప్పుడున్
శోధనంబు సల్పి పిదప ♦ సుఖము లిచ్చుం గావునన్
బాధ కాదు నేండిదెల్లం ♦ బంకజాక్షు కృపకు సత్
సాధనం బటంచు నీవు ♦ ధైర్య మొందు డెందమా! 50

హస్తమా! నీ పరాక్రమము చూపుట కిదియే సమయము.

### లయగ్రాహి.

హుమ్మనుచు శత్రునిచ ♦ యమ్ము నెగజిమ్మి సమ
రమ్మున జయమ్ము వెద ♦ చిమ్ముము కరమ్మా!
ముమ్మరపు మోహమక ♦ రమ్ము వడి మానస గ
జమ్ము నిహసౌఖ్య సలి ♦ లమ్ములకు నీడ్చున్

జమ్మనుచు జ్ఞానిక ♦ రమ్మను సుదర్శన వ
రమ్మున రణమ్మున జ ♦ య మ్మిపుడు కొమ్మా
అ మ్మకరముల్ దునిమి ♦ నెమ్మదికి శాశ్వత సు
ఖ మ్మొసఁగు నీ కిది ఘ ♦ నమ్మగు కరమ్మా! 51

పుత్రికా! నీ విచట నిలువుము.

శర్మ—చిత్తము. అలాగే చేయుచున్నాను.

రుక్మ—(శరము నుద్దేశించి) అక్కటా శరమా! నీవేమి చేసెదో కదా.

మ. పరమాహ్లాదముతోడ నిన్ సుహృదుగాఁ ♦ బ్రాణాప్తుఁగా భ్రాతఁగా
చిరకాలంబు వహించితిన్ మఱియు నా ♦ జీవంబుగా నెంచితిన్
శరమా! నాపయి నాగ్రహింపక మదిన్ సంకోచముల్ లేక నీ
చిరసౌహార్దవిశేషతన్ సుతు శిర ♦ శ్ఛేదంబుఁ గావింపుమా! 52

హా! జగద్రక్షకా! (అని శరంబును బాలుని కంఠముపైఁ బ్రయోగింపగా నది పుష్పహారమై వాని కంఠంబునుఁ జుట్టుకొనుచున్నది. అది చూచి) ఔరా! ఇది యెంత చిత్రము! ఈ శరంబయిన వీని కంఠంబును దునుమక పైమిక్కిలి తా నొక పుష్పహారమై వీని కంఠంబునుఁ జుట్టుకొనుచున్న దే! అక్కటా శరమా!

చ. ప్రియసఖి వాదులాడుటలు, ♦ పెల్లుగఁ బట్టపుదేవి నోచ్చుటల్,
నయరతుఁ బుత్రుఁ జంపఁగ ఘ ♦ నంబుగ నిన్గొని వేఁడికో, లయో
మయతను వించు, నిందులకు ♦ మానస మొప్పమి, నౌర! యిట్టులౌ
నె? యనుచు సౌమనస్యముఁ వ ♦ హించి యయోమయు నన్నెనర్చితే

ఇప్పుడు నే నేమి చేయుదును? (అని తనలో)

తరలి వృత్తము.

తల్లి, సుతుఁడు, తండ్రి మఱియు ♦ ధాతృసుతయు నొక్కటన్
వల్లె యనుచుఁ బుత్రుఁ దునుమ ♦ వాంఛఁ జేసి యుండఁగా
నొల్లనిగతి నమ్ము లకట! ♦ యూఱకయె తలంగెడున్
నల్లదౌర వరమ్మొసఁగిన ♦ నంబివరము కానటుల్. 54

మ. కలకాలంబు భరించినన్ బెనిచినన్ గష్టంబులన్ గాచినన్
జెడుకాలంబు తటస్థమైనయెడ నిస్సీ యంచు సౌమ్యాత్మకుల్
చెలికాం డ్రాప్తులు బంధులున్ విడుచుటల్ సిద్ధంబెయౌఁగాని యీ
పలుకన్ లేని యచేతనంపు శరమున్ బాసెం గదా దైవమా! 55

నేనొనర్చు వ్రతమునం దేమైన దోషంబు కలిగియుండునా? అట్టి దేమియుఁ గానరాదే! హా పరమాత్మా! ఆపద్బాంధవా! దీనశరణ్యా! నే నెవ్వరివాఁడ నగుదు? నేఁడు నన్నిట్టు లేల యలయింపఁ జొచ్చితివి? నన్నుఁ బరిశోధింపఁదలఁచియే యిట్టి యిక్కట్టులఁ బెట్టి రట్టువడం జేయుచుంటివా? వీని శిరం బెంతయు ఖండింప శక్యంబు గాకయుండె. ఖండించినగాని నావ్రతంబు నెఱవేఱదయ్యె. ఇట్టి సమయంబున నీ దీనుని మొఱాలకించి దీనవత్సలుం డను బిరుదు నిలుపుకొమ్ము.

ఉ. హా! విధినేమియందు? మది నారట మెట్టులు డిందు? నింక నా
యీవెత కేదిమందు? మఱి యెవ్వరితో మొఱవెట్టుకొందు? నీ
వీవగ నూరకుందు విది యేటి తమాష బలే పసందు! దా
సావనుఁడన్న నీదు బిరుదాంకము భద్రము! దీనరక్షకా! 56

(అని మఱియొక ఖడ్గముం గైకొనుచున్నాఁడు)

మోహి—కటకటా, కఠినహృదయా! వేఱొక ఖడ్గముం గొని ఖండింపఁబోవుచుంటివా? ఆ యచేతనం బగు శిరంబునకైనఁ గనికరము వుట్టెఁగాని నీహృదయపాషాణంబు కరఁగదాయె! ఈ ఘోరకృత్యం బీశ్వరప్రీతికరం బగునేని యా శిరం బట్లు పుష్పహారమై వీని మెడం జుట్టుకొనునా! నీ విందు కేమనియెదవు?

రుక్మా—ఏమందునా? నీవు కేవల మనుష్యమాత్రురాలవు కావనియు, మాయాస్వరూపిణివనియు, నిదియెల్ల నీ మాయావిశేషం బనియు ననెద. (రౌద్రముతో) నీవింక నన్ను సమీపించి యడ్డదిడ్డంబు లాడకుము. నాచేతిలోని యిది ఖడ్గం బని యెఱుంగుము. బాపురే! నిర్మలచిత్తంబున మాయారహితుం డగు బరాత్పరు నెప్పుడారాధించు నే నీతుచ్ఛమాయావిచేష్టితంబులకు వెఱతునా? హా గజరాజవరదా!

ఉ. ఏన ప్రిభుండ నేని, భువి♦ నెన్నఁ డసత్యముఁ బల్కనేని, యేఁ
బూనిన యీ వ్రతంబు సుర♦పూజ్యము విష్ణుప్రియంబు నేనియున్
మానుగ వేదవాక్కులు ప్ర♦మాణము లేనియు, మద్వ్రతార్థమై
వీని శిరంబు నేఁ డిట భు♦విన్ బడకుండున యొక్క వ్రేటునన్. 57

(అని ఖడ్గ మెత్తి వ్రేయఁబోవఁగా శ్రీవిష్ణుమూర్తి శంఖచక్రకిరీటధారియై ప్రత్యక్షుం డగుచు రుక్మాంగదుం డెత్తిన ఖడ్గంబుఁ బట్టుకొని)

ఉ. తాళుము తాళు భూప! యిఁకఁ♦ దత్తర మొందకు; నీదు భక్తికిన్
జాలఁగ మెచ్చినాఁడ; మది♦ సంతసమందెను; నీ సుతుండు నీ
యాలును మేటిభక్తిఁ దన♦రారినవారలు; మీరు మువ్వురుం
బాలును నీరు శర్కరల♦ మాడ్కిని గూడినవార లిచ్చటన్. 58

రుక్మాంగదుఁడు, సంధ్యావళి, ధర్మాంగదుఁడు, మోహిని
గజరాజవరదా! ఆపద్బాంధవా! నమస్కారము.

దండకము.

శ్రీమన్మహాదేవ యీశా! లసచ్చిత్ప్రకాశా! మహాఘోర పాపప్రణాశా! పరేశా! భవద్దివ్యసందర్శనానందకాంతిన్ దివిన్ దేవ ముఖ్యుల్, భువిన్ మానవేంద్రుల్, వనిన్ మౌనివర్యుల్, మహాభక్తి వారాశిపారంగతజ్ఞానసంపన్నులై యొప్పు వ్యాసాంబరీషాది భక్తాగ్ర గణ్యుల్సదా నీదు పాదార్చనధ్యాన సంకీర్తనంబుల్ కడుం బ్రీతి గావించి సంతృప్తులై పొంగుచుందుర్ గదే భక్తహృత్పావనా! * దేవ నీరూపుఁ గన్గొన్న మాత్రాన నీనామమున్ విన్నమాత్రంబునన్ శాకినీ, ఢాకినీ, కామినీ ముఖ్య దుష్టగ్రహాంబుల్, మహాభూతప్రేతంబులున్, బల్ పిశాచంబులున్, గాలిదయ్యంబులున్ గూలిపోవుం

గదే; దుష్టనాశా! విరాట్పూరుషా! విశ్వరూపా! జగద్రక్షకా! వేద వేదాంతవేద్యా! పరంధామ! జ్యోతిస్వరూపా! * జగంబెల్లఁ బుట్టింపఁగాఁ బెంపఁగా ద్రుంపఁగా నీవ కావే? జగన్నాయకా! యూర్తరక్షా మణీ! కామితార్థప్రదా! యిట్టి లోకాధినాథుండవై యెప్డు నీదివ్యరూపంబు మా పూర్వపుణ్యాంబునం జేసి నేఁడిందు మా కన్నులారంగఁ గన్గొంటిమయ్యా! దయం జూడుమయ్యా దరిం జూపుమయ్యా మముం గావుమయ్యా * కృపాసాగరా! దానవధ్వంసదేహావర్తీ! జగద్గీతకీర్తీ! నమో దీనబంధూ! నమో జ్ఞానసింధూ! నమో భక్తనేతా! నమో ముక్తిదాతా! నమో సచ్చిదానందమూర్తీ! నమస్తే నమస్తే నమః.

విష్ణు—రుక్మాంగదభూపాలా!

ఉ. మెచ్చితి నీదు వర్తనకు ♦ మెచ్చితి నీదగు సాధువృత్తికిన్
మెచ్చితి నీదు యోగ్యతకు ♦ మెచ్చితి నీ సుజనానురక్తికిన్
మెచ్చితి నీవ్రతంబునకు ♦ మెచ్చితి భక్తికి; మెచ్చి సద్వరం
బిచ్చితి; మీరలెల్ల సుఖ ♦ యింపుచు రాజ్యసుఖంబు లందుఁడీ. 60

రుక్మా—మహాప్రసాదము. ఆశ్రితవత్సలా!

విష్ణు—రాజేంద్రా! ఏనొక్క రహస్యంబు దెలిఁగింతు వినుము.

## మానినీ వృత్తము.

నీ నిజభక్తిని నీదు సువర్తన ♦ నీవ్రతనిష్ఠఁ గనుంగొనఁగన్
మానిని మోహిని బ్రహ్మ సృజించి క్ర ♦ మంబుగ నీదరికిన్ బనుపన్
గానివిధంబులఁ గాఱియవెట్టి య ♦ ఖండశ్రమంబుల నిగ్గలచెన్
గాని యమాయికురాలిది మోహిని ♦ కంటకురాలని యెంచకుమీ.

ఈ యువతి నిర్దోషి. నీ సంధ్యావళ్యాది నూర్వురుభార్యల మరలఁ జేకొని తొల్లిఁటి యట్ల గౌరవించి యేలుకొమ్ము. మఱియును

ఆ. సృష్టి నిన్నుఁగూర్చి ♦ సృష్టించె నిక్కాంత
గాన యొకల పొత్తు ♦ కాదు సుమ్ము

అఖిల ధర్మవేత్త ♦ యనుపమ నుతశీల
నీకుఁ దగిన కాంత ♦ నిర్మలాత్మ! 62

కావున నీ తరుణీమణిని నీ పట్టమహిషియగు సంధ్యావళితో సమగౌరవంబున నేలుకొమ్ము.

రుక్మాం—చిత్తము మహానుభావా! దేవర యాజ్ఞ శిరసావహించి యట్లే యొనర్చువాఁడ.

విష్ణు—విధివ్రాలుచొప్పున మీ రీలోకంబున నుండునంతకును రాజ్యసుఖంబు లనుభవింపు చుండి యంతంబున నాసన్నిధినిఁ జేరఁగలరు. మీర లింక నేమైన వరంబుల వేఁడ వలతురేని యడుగుఁడు. ఒసంగ నిశ్చయించి యున్నవాఁడ.

రుక్మాం—మహానుభావా! ఆశ్రితకల్పభూజా! నాకు వేఱు వరంబు లేల?

మానినీ వృత్తము.

నా ప్రియపత్నులు నావరపుత్రుఁడు ♦ నాహితబంధులు నేను ప్రజల్
శ్రీపతి! నీపదచింతన వీడక ♦ చిత్తము లెప్పుడు నీకడనే
కాపురముంచి, దృఢంబగు భక్తిన ♦ ఖండసుఖాప్తిని గాంచునటుల్
పాపవినాశ! మహేశ! పరేశ! కృ ♦ పన్ దయసేయవె లోకపితా!

విష్ణు—సంధ్యావళీ! నీ వేమి కోరెదవు?

సంధ్యా—భక్తజనార్తిహరణా! రమారమణా!

మ. తరుణుల్ విద్యల నేర్చి, వేత్తలయి, మ♦ద్రాజ్యంబునం దెప్డు స
చ్చరితంబుల్ బఱియింపుచుం విభులకున్♦సంతోషముం గూర్చుచు
న్వరపూజానిపుణైక చిత్తలయి స♦ద్విద్యాప్రపారపారీణలై
యిరవొందన్ వరమీఁగదే గుణనిధీ♦యీశా! జగన్నాయకా!

విష్ణు—బాలకా! ధర్మాంగదా! నీవేమైనఁ గోరెదవా?

ధర్మాం—భక్తవత్సలా! కరుణాకలాపా! నాకేమి కావలయును?

---

127 వ పుటలోని దండకము పై నలువురిలో వరుసగా నొక్కొక్కరు
* ఈ గుర్తువఱకుమాత్రము చదివిన బాగుగ నుండును.

ఉ. పిల్లలు తల్లిదండ్రులను ♦ బేర్మిని దైవములంచు నెంచి, తా
మెల్లెడ వారి చిత్తముల ♦ కెక్క నటింపుచు, మత్పురంబునన్
నల్లలితప్రచారు లయి ♦ శాశ్వతసౌఖ్యము లందునట్టు లు
త్ఫుల్లసరోజనేత్ర ! సుర ♦ పూజితగాత్ర ! యనుగ్రహింపవే. 65

విష్ణు—విధితనయా! మోహినీ! నీయభీష్టం బెట్టు లుండె ?

మోహి—కపటనాటకసూత్రధారీ! కలుషభయవిదారీ!

ఉ. ఆ విధియాజ్ఞచొప్పున ధ ♦ రాధిపుచెంగట నే నటించి న
ట్లీ విపరీతభంగి భువి ♦ నేసతియున్ గొనకుండుమాడ్కి నీ
భూవర సత్కథాశ్రవణ ♦ పూతమనస్కులు క్రూరచిత్తయం
చో వరదాత ! నన్ దలఁప ♦ కుండెడుమాడ్కి ననుగ్రహింపవే.

విష్ణు—ఔరా! మీరు కోరిన వరంబులు మిగుల శ్లాఘనీయంబులు. అట్టులే యొసంగితి. రాజచంద్రమా! మరియొక విశేషం బెఱింగింతు వినుము. నీ విప్పుడీ హరివాసరవ్రతమాహాత్మ్యంబున సర్వజనమాన్యచరిత్రుఁడ వయితివి. కావున

చ. బుధజనవంద్యమై సుజన ♦ పూజితమై తగు నీచరిత్రమున్
బదఁపడి యెవ్వరేనియున్ న ♦ వారణభక్తి విశుద్ధచిత్తులై
చదివిన వ్రాసినన్ వినినఁ ♦ జాలగ వారలు భోగభాగ్య సం
పదలఁ జిరాయువున్ గలిగి ♦ వర్ధిలుచుండెద రెప్డు మత్కృపన్.

నేను పోయివచ్చెద. మీరు సుఖంబున నుండుఁడు.

(అందఱు నమస్కరించుచున్నారు. విష్ణుమూర్తి యంతర్ధానం బగుచున్నాఁడు.)

రుక్మా—సఖులారా! పరమేశ్వరానుగ్రహంబున మన మిప్పటికి ధన్యుల మయితిమి. నేను బహుకాలం బీ రాజ్యంబెల్ల వహించి యలసియుంటి. కావున నిపుడీపుత్రుని యువరాజ్యపట్టాభిషిక్తునిఁ గావించి యే నీశ్వరధ్యానైకరతుండనై యుండఁ గుతూహలంబు గలుగుచున్నది. ఇందుకు మీ యభిమతం బేమి ?

సంధ్యా—ప్రాణేశ్వరా! అట్లే కానిండు.

మోహి—నేను దేవర చిత్తానుసరణంబుగ వర్తించువానఁ గాని వేఱుకాదు. అట్లే యొనర్చెదఁ.

రుక్మాం—పుత్రా ! నీ యభీష్టం బెట్టు లుండె ?

ధర్మాం—జనకా ! నాకు నీ యాజ్ఞాపరిపాలనంబునకన్న భాగ్యం బేమికల్గు ? దేవర చిత్తానుసరణంబుగ నొనర్చెదఁ.

రుక్మాం—అట్టులయిన నిపుడే చని యువరాజ్యపట్టాభిషేకోత్సవము గావింతము రండు.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)



## ద్వితీయ రంగము పట్టాభిషేక మండపము.

[ ప్రవేశము :— రుక్మాంగదుఁడు, గుణనిధి, సంధ్యావళి, మోహిని, చకోరాక్షి, పద్మగంధి, ధర్మాంగదుఁడు, బ్రాహ్మణులు మొదలగువారు. ]

అందఱు—(ధర్మాంగదునిఁ బీఠముపైఁ గూర్చుండఁబెట్టి)

ధర్మపరిపాలనశీలా ! ధర్మాంగద భూపాలా !

చ. ధరకు ముదమ్ముఁ గూర్చి, విబు♦ధవ్రజమున్ సుఖులం బొనర్చి, స
త్పురుషుల నాదరించి ముని♦ముఖ్యుల పూజలొనర్చి యార్తులన్
గరుణను బ్రోచి నిన్నుఁ గల♦కాలము నెల్లరు మెచ్చఁ బ్రొద్ది నీ
శ్వరకృప నేలుమయ్య నర♦పాలక ! సజ్జనగణ్యా ! బాలకా ! 68

క. శ్రీరమణీ ప్రియరమణా !
సారసదళనయన ! మోక్ష ♦ సాధననిపుణా !
సారాశ్రితభవతరణా !
యూరీకృతభువనభరణ ♦ యురగపశయనా ! 69

మాలిని.

శ్రితజనపరిపోషా ♦ సిద్ధచేతోవిశేషా !
పతితజనని[illegible]షా ! ♦ భాస్వరద్దివ్యవేషా !
అతులితమృదుభాషా ! ♦ ఆర్యహృత్కంజపూషా !
కృతమణిసరభూషా ! ♦ కీర్తితాపారతోషా ! 70

( [32] అంగనలును రుక్మాంగదునిపైఁ బుష్పములు చల్లుచున్నారు.)

గద్య

శ్రీమదుమారమణకరుణాకటాక్షపాత్ర శ్రీవత్ససగోత్ర బేతపూడి
వంశ క్షీరపారావార రాకాసుధాకర మల్లేశ్వరామాత్యపౌత్ర,
నిరంతర శివారాధనపరాయణ లక్ష్మీనారాయణామాత్య
చతుర్థపుత్ర, గుణకదంబ లక్ష్మాంబాగర్భసంభూత,
సుజనవిధేయ, భగవంతాభిధేయప్రణీతంబైన
రుక్మాంగదనాటకంబున నిది
షష్ఠాంకము.

సంపూర్ణము.



# పీఠిక.

రంగస్థలమం దచ్చటచ్చటఁ బాత్రములు పాడుట కనుకూలించునట్లు కథాసంబంధముఁ గల కొన్ని పాటల నిచట వ్రాసియుంటిని. ఇందు మొదటి మూఁడుపాటలలో నొకటిగాని రెండుగాని నాటకారంభమందు సూత్రధారుఁడు పాడఁదగును రంగస్థలము దేకారణముననైన విరామముగలప్పుడు స్వప్రయోజకత్వప్రకటనార్థముగను, సభ్యహృదయరంజనార్థముగను సూత్రధారుఁడు నే పద్యమందుఁ బాడుట కనుకూల పడునట్లు నం. 33 మొ 36 రుల వఱకుగల పాటలను వ్రాసియుంటిని. వీనిలో నొకటి రెంటిని మాత్రము పాత్రలకొఱకై సూచించితిఁ గాని యిట్టివి పాడుటకుఁ దగిన వేషధారులు దొరకుట యరిది. వీనియందు ఆవర్తనియమమును, మాత్రాకాలంబును లఘుద్రుత సహితంబుగఁ దెలియఁబఱచియుంటిని. వీనియందు దీర్ఘాక్షరముల చెంత (,) ఈ గుర్తులెన్నియుండిన నన్నిమాత్రల కాలమని గ్రహింపవలయును. దీర్ఘాక్షరములమధ్య ఘాతవచ్చినపుడు దానిని హ్రస్వముగ వ్రాసి ఘాత పడవలయుచోట పైగురుతును వ్రాసియుంటిని. స్వరములపై —యీ గురుతులు గలప్పుడవి పై కాలస్వరములని తెలియవలెను. ఈ 36 పాటలు గాక, పాటలుగాఁ బాడఁదగిన 30 వృత్తములు గ్రంథమందు వ్రాసియుంటిని. గుణగ్రహణపారీణులును, గానవిద్యావిశారదులును అగు విద్వాంసులెల్లరు నిందలి లోపంబుల మన్నింప వేఁడుచున్నాఁడ.

బెజవాడ,
8—8—1916.

ఇట్లు బుధజన విధేయుఁడు,
బేతపూడి భగవంతరావు.

2 దానవభంజనా ! దీనజనావన ! మానినుపోషణా ! మానితసుగుణా !
శంకర.

8 ఈశ ! శ్రీభగవంత-దాసనుపోషా ! వాసవ నుత ! స-ర్వేశ పరేశ ! శం.

(సూత్రధారుని పాటలకు సూచన లీయఁబడ లేదు. పీఠిక చూడుఁడు)

7 [4] రుక్మాంగదుఁడు.

బేహాగ్ రాగము-ఆది తాళము.

అందంబైనది సుమము । యే । మందును దీని సరసము
డెందంబున నా-నందంబును జెం-పొందఁజేయు నిది నిజము.

1 అందంబగు నగలందు-తళుక్కు- మ-నందగి యున్నది సుమము ।
సుందర యువతి య-నందగు సతిశిర-మందిది నిల్చిన ఘనము. అం.

10 [5] ఖరహరప్రియరాగము-ఏకతాళము-తిశ్రజాతి.

(రుక్మాంగదుఁడు, సంధ్యావళి, సాహిత్యముమాత్రమే పాడవలెను.)
పాపపా-ధసా-నిదపా-మగా,,-మగరీ,,,,.
శ్రీకరా-శుభా-కఅరా-నమో,,-నఅమో,,,,.

1 దామ దామ దా మ దా-ధసా-సగరిసా।సాస స రి స -
నే ర మే ర బ్రోవ రా-కృపా-అఅక రా । ధీర యఘువి -
నీ ని నిసని-దాద దనిదపా । సా నీ దా నిదపా -
దూర నిగమ-సార గఅవరా । మారా కా అఅరా -
సా నీ దా నిదపా-సాస మగరిసా.
సా రా చా అఅరా-రా ర సుఖక రా.

2 పంత మింత సేయు మేర గాదురా । ఎంతయును భ-జింతుము భగ-
వంత దాస నుత ! శాం తా కా రా - చింత దీర్చి -సంతస మిడరా
శ్రీకరా.

(ఇష్టమైనవార లీయింగ్లీషుపాటను పైమట్టుప్రకారమే పాడుకొనవచ్చును.)

నాత్రి— Bless our Society God ! Creator !

For your beloved look we always look - clear the faults and-give us free thoughts in - all that we enact- Almighty ! and-Omnipresent ! all is this, we all now meant-make us all pleasant. Bless.

11 [6] శుకయోగి.

## మాయామాళవగౌళరాగము-ఏకతాళము.

నారాయణా నారాయణా-నారాయణ శ్రీమన్నారాయణా.

1 ధనధాన్యంబులను-మఱి-దారసుతాదులను । ఘనముగఁ గన్గొనక-నిను-
ననుదినమును మది నిల్పవఁ జాలును, నారాయణా

16 [7] శుకయోగి. (పై పాటలోని చరణములే)

నారాయణా నారాయణా-నారాయణ శ్రీమన్నారాయణా.

2 ఇసుములు కల్లునెడన్-అవియుఁ బరీక్షకె యనుచు నెవన్ గను
నిశ్చలత గుటిక్-గొలఁగక-కార్యసిద్ధి నొందఁగా మేలగున్.

3 ఎంతటి ఘనుఁడైనన్-నర-నీశ్వరుఁడే యైనన్
వంతలు తప్ప విలన్ భగ-వంతుని దలఁచిన శాంతి లభించును. నా.

28 [8] నారదుఁడు.

## హనుమతోడిరాగము-ఏకతాళము-చతురశ్రజాతి.

శంకరా! రిపు-జాలభయంకరా.
పంకజాక్ష! భవ-పాలనా! శంకరా. శంకరా.

1 సుజన వినుత పద-సూరిజనాభయద । త్రిజగదభీష్టప్రదా
శుభదా శంకరా.

2 మదన దమన మనా-మానితసుగుణా । మదగజరిపుదమనా రమణా!
శంకరా.

33 [9] నారదుఁడు.

## ధన్యాసిరాగము-ఆదితాళము.

సర్వవ్యాపకుఁడైన యీశ్వరా-శరణు శరణు దేవా!
సర్వాధారుఁడు సర్వేశ్వరుఁడును-సర్వశక్తుఁడగుదు వీవె తండ్రీ స.

1 తనదైవంబని పరదైవంబని-తగవులాట తగునే?
కనుగొన సర్వవ్యాపకుఁ డొక్కఁడని-కంటె మంచనగునే? యీశా స.

34 [10] యముఁడు.

## ముఖారిరాగము-ఆదితాళము.

ఔరా! యెంతవచ్చె । నా । యాశలెల్లఁ బోఁజొచ్చె ఔర.
ఆ రాజేంద్రుని వ్రత మహిమను-నా రాజ్యం బిటు కాఁగల్గెను,
తేరా! నాకొక దరిఁజూపఁగ-ధీరాగ్రగణ్యు లెవ్వ రిలలో? ఔర.

1 అన్నా! యిప్పటి నాటక మనుచు నన్నా రిట్టివింత కల్గుట। యెన్నఁడైన మీర కిలలోఁ గన్నారే? విన్నారే? తెల్పరె! ఘోరా.

36 [11] a. సురహరప్రియ రాగము—ఏక తాళము.

యము—శెబాసు! ధాత! చాలయ్యా—మంచిఁ—జేసివాఁడ వింక నన్నుఁ బంపుమీ। గొప్ప। ప్రభునిగ నన్నొనర్చినాఁడ వహహా. సెబా.

బ్రహ్మ—అహా! యిదేమి శమనా? యింత కూరటంబుఁ జెంద నీకుఁ దగునా? ఘోర సాహసంబు లిట్టు నీవు చేయ నగునా? ఆహా.

యము—అతఁ డిట్లు వ్రతి మొనర్చు టేమి? దీని - చేత నాదు లోక మిట్టు లౌట యేమీ? సెబాసు.

బ్రహ్మ—(తలయూఁచి యూరకున్నాఁడు.)

యము—చేతకాని వానిఁ బోలియుండనా? దీని - చేత నాదు లోక మింక నిల్వఁగల్గునా? సెబాసు.

బ్రహ్మ—కీడు మేలు లేరికైనఁ గల్గదే? వాని-కోడి యిట్లు జేలలు చుంట తగవే. ఆహా.

36 [11] b. యముఁడు.

మాళవగౌళ రాగము-ఏక తాళము-చతురశ్రజాతి.

ఏమి యిట్టి రాజునుంచి ఫలము? నా-కేమి తోఁచదయ్యో దీని గుణము నీమనంబునందు దీని - కేమి యెంచినావో కాని। రామ రామ నేను నట్టి-రట్టుపాలు గాగనయ్యో. నేమి.

1 అతఁ డిట్లు వ్రతమొనర్చు టేమి? వీని-చేత నాదు లోక మిట్టు లేమి? చేతకానివానిఁబోలి-చేతు లొగ్గి యుండఁజాల। ధాత నన్నుఁ బంపు నీకు-దండమయ్య చాలుఁజాలు. నేమి.

(ఈ 11 a b లలో నొకటిమాత్రము పాడినఁ జాలును.)

39 [12] యముఁడు.

కాఫీ రాగము-ఏక తాళము-చతురశ్రజాతి.

1 ముల్లోకములకెల్ల-మూలమైన ధాత। యల్లభూపుఁ డిట్లు సాధింపఁడే? నా-యాసలెల్లఁ దీర్పఁడే?

2 ఈతని మాయచే-నాతండే రానిమ్ము। పాతాళ మంటఁద్రొక్కనే-బహు-బాధలను బెట్టనే?

3 కటకటా! యతఁడు నా-కింటనే పడనిమ్ము | పెటపెట మనం జేల్చనా? మఱి-పెక్కు నెతలఁ బెట్టనా?

41 [13] మోహిని.

ఖమాంచిరాగము-ఏకతాళము-త్రిశ్రజాతి.

బళిబళి సుచరిత్రముల్-నీ-పలుకు లతి విచిత్రముల్ | ఇల నృపతు లనం గనె మా-నీందుర్లె జనకా! బళి.

1 సాంగఁడే? కలంగఁడె? రు-క్మాంగదుఁ డన ధీరుఁడే? అంగనల నెఱుంగని బుష్య-శృంగుఁడె జనకా! బళి.

2 తుంటవిల్తుఁ డల్పుఁడె? వె-న్నంటి గెలి నల్పుఁడే | నా కంటఁబడిన యంత వీని-గర్వముఁ గడల్పుఁడే? బళి.

44 [14] కాఁపులు.

నాధనామక్రియరాగము-ఏకతాళము-త్రిశ్రజాతి.

మా పాలి యంకన్న శరణు | ఏ | పాప మెఱుఁగ మిలను. మా.

1 కొబ్బరి కాయలు-కొల్లగ నీకిచ్చి గొబ్బున నెప్పుడు కొల్తుము దేవా! దబ్బున రమ్మి-దరిజేర్చుమమ్ము-నిబ్బర మిమ్మి-నీదే భారమ్ము. మా.

2 యేడు కొండలమీఁద-యేలసిన దేవా! తోడు నీడ మాకు-దొర వీవ కావా? నేఁడిటు రావా? నెమ్మది నీవా? గోడు బాపవా? కోర్కె లీవా? మా.

53 [15] మోహిని.

బేహాగ్ రాగము-త్రిపుటతాళము-చతురశ్రజాతి.

ఎంతో సొంపై యున్నది-మది-కెంతో యింపై యున్నది.
వసంత మనంత లతాంత సంతతుల. ఎంతో.

1 చల్లగాలి వేగ-నల్లుకొని రాగ | ఉల్ల ముప్పొంగ జల్ ఝుల్లు మనంగ హా. యెంతో.

2 కమ్మతేనె మెక్కి-నెమ్మి బాగ కెక్కి | తుమ్మెదల తేఁడు ఝం-ఝుమ్మనఁగ నేఁడు హా. యెంతో.

3 సంతసించి శుకము-పంతగించి పికము | కంతుఁడే యీడ భగ-వంతుఁ డని పాడ హా. యెంతో.

54 [16] మోహిని.

## సురటరాగము-ఆదితాళము.

ధన్యుఁ డనఁగ నతఁ డే-జగంబున.

అన్య మెఱుంగక-యల యువతీజన । మాన్యుఁడైన గుణ-మహితుఁ డొక్క-రుఁడె ధన్యు.

1 అల్లరిమారుని-యలయికలకుఁబడి- వెల్లువడఁకి మై-జల్లనంగ । మల్లడిఁగొనియెడు-పల్లవపాణి కాఁ । గిళ్లలో నవఁగి సుఖింప లభించిన. ముక్కు-నఁ గల చెలి - మదుపు లందిచ్చుచుఁ - బిక్కఁజేరి యొకసక్క- మాడఁగా । గక్కు-నఁ బైకొని - కౌఁగిట నలమి యా-చక్క-ని మోవి చు-రుక్క-న నొక్కి-న ధన్యు.

3 చెంతనిలుచు ప్రియ-కాంతలఁ జక్కి-లి । గింతల వింతల నెంతో తేల్చి । కంతురాజ్య మ-ల్లంతఁ జూరఁగొను కాంతుఁ డనఁగ భగ-వంతుఁడె యనఁదగు ధన్యు.

| | | |
|---|---|---|
| సా, ని స ప-మపధపా - మగప మరి | రీ, సా, - నిస | రి మప-రీ, మ ప ని |
| మా, రుముల - సురటిరేఁ - బలుసొగస | టం,చుఁ-మది | దెలిసి - ప్రే,మఁగొని |
| సా, రి రి స-ని రిసని ద ప-మ ప ని స | రి సాని దప-ధప | ,మగ రి-పమ రీ - |
| పా, రులను -మదిగఱచెడి - యువతుల | ముదం బెసగ-నెదం | ,గడియు-సదయా- |
| రి స. | | |
| త్ముఁడె ధన్యుఁడు. | | |

56 [17] శంకరాభరణరాగము-ఆదితాళము.

రుక్మా—మానిని యెవ్వరవే? గుణ-మండిత! నీ పే రెదియే? యీ కానలఁబడి యను-మానములేక ప్ర-యాణమి దెచ్చటికే?

మోహి—ఎవ్వరైననేల? పే-రెద్దియొ నీకేల? యిప్పనభూమిఁ జ-రింపఁగఁ దగదె యిఁ-కెవ్వరు నెవ్వేళ?

రుక్మా—వనితరో! పతి యెవరే? నీ-జనకుండే ఘనుఁడే? విన వేడుక క-ల్గెను దెల్పుమ నా-మనవిని విని వేగ.

(ఈ పాటకొఱకు ప్రసంగములో * ఈ గుర్తునకును విడిచివేయవలెను.)

మోహి—జనకుఁ డల విధాత; నికేన్వం... ను నవివాహిత; అవిధ-
మనమునఁ బుట్టి మో-హిని యనఁబడితి; ఏ మనిన నీకేల యిటు?

58 [18] మోహిని.

ధీరశంకరాభరణము- (ఫారసీమట్టు) ఆదితాళము.

వింతవింత లాడితి - సంతసంబుఁ జూపితి | చెంతనట్టె చేరితి - చేయి బట్టవచ్చితి | తగుర! - తగుర? - పరులు - నగర? - జో రా కన్నులు కానవా? | ఇనకులజుఁడవా? - యిటులఁ బ్రభుఁడవా? - యింకేటి వాఁడవా? - మతిమఱచితివా? - మాతో నిటుఁ దగువా? - చాల్ చాల్ పో.

(తెనుఁగు పాటల నియమములు ఇట్టి ఫారసీమట్లయం దుండవు.)

59 [19] ధీరశంకరాభరణరాగము—ఏకతాళము—త్రిశ్రజాతి.

మోహి—చాలయ్య రాజేంద్ర చాలు - నీకథ - చాల్చాలు పోపో
వయ్యా | మేలయ్య! నీవెత్తి - మేలను లిట నిం-కేల చేసె
దయ్యా? | యీలీల వీడుమయ్య చాలయ్య.

రుక్మా—అక్కటా కోమలి యేల నన్నిటు - లాడఁ జూచెదే? | ఎక్క-
వౌ మరుబారిఁ జొక్కితి నీకేలఁ - జిక్కితిఁ గావఁగదే | నీకె |
దక్కితి నేలఁగదే అక్కటా.

మోహి—నాకేలఁ జిక్కఁగ - నీకేల యీ వెత్తి - పోకలు మాను
మయ్య! జోకతో నీకెల్ల - సుఖము లొసంగ న-నేకులు లేరఁ
టయ్య? | యిట్టి | సోకులు చెల్లునయ్య? చాలయ్య.

రుక్మా—కొమ్మరో! నిన్నెద - నమ్మితి నీకు నే - నమ్మితిఁ గావఁ
గదే | నమ్మి నే నీవాఁడ - నుమ్మిఁక నన్నేలు - కొమ్మి సమయ
మ్మిదే | కాదు | న్యాయమ్మను జూపఁగదే అక్కటా.

62 [20] రుక్మాంగదుఁడు.

బేహాగ్ రాగము-ఏకతాళము.

తలోదరీ! యిటు వినుమా-నను దయఁగనుమా—యనుమా—నము విడుమా.

1 (మిశ్రగతి) వేఁడి-వేఁడి — మోడి — నాఁడ — మోడి — చేయఁ —

జాడకే- (చతురశ్రగతి) సఖీకా-సుదతీకా-గడువయు నికుమకా - జూపెం గడవే-శుభం బగుకా. తలో.

68 [21] ధీరశంకరాభరణరాగము-ఏకతాళము-చతురశ్రజాతి.

సాని-సగ్గామపా । మా । పాదాద్ద- పామాప - గమగరిసా. పాపాప - దాదాప-నీనీని-సాసాస-నీనీద-పాదా-నిసానీదాపా । పాదాద్ద-పామాప-గమగరిసా. సాని-సగామపా.

పద్మ—అయ్యో । దయామయుండే
చతు— ... ... ... కాఁడబద్ధ మబద్ధ మబద్ధమే,
1 పద్మ—ఆనాఁడు-మనల-మన్నింపఁ-గా లేడె? ।
చతు— ... ... ... ... ఆనాఁ డిట్టివాతి లేదయ్యెఁగా
పద్మ—హా! నాథుఁ డన్యుఁడె?
చతు— ... ... ... నమ్మఁదగదె. అయ్యో.
2 పద్మ—లాలించి-బేలించి-పాలింపఁగా లేడె?
చతు— ... ... ... మేలెంచి-కాడె కాఁ-గిలింపనే ।
పద్మ—ఆలించు నా మొఱ
చతు— ... ... వినఁదగదె. అయ్యో.

70 [22] పద్మగంధి.

అసావేరి-ఏకతాళము-మిశ్రజాతి.

ప్రాణేశుఁ డొల్లని-బ్రతుకేల జగమెల్ల । బహుదుఃఖాకరమే నమ్మా.
1 మానినికిని భువి - మాన ఘనములకు । ప్రాణేశు సేవయే - పరమార్థ మమ్మా. ప్రాణేశుఁ.

73 [23] పద్మగంధి.

కాఫీరాగము-ఏకతాళము-చతురశ్రగతి.

ఎటులు సహింతు నో-యీశా యీ దుర్దశ?
ఎటులు సహింతు-నే-నెటులు భరింతు. ఎటులు.
1 కటకట! విభుఁడు పర-కాంత పాలగుట । నెటులు నే విందు? భువి-నెట్లు మనియుందు? ఎటులు.

74 [24] సంధ్యావళి.

### కన్నడరాగము-ఆదితాళము.

వినుఁడీ, యిం కేమి జరుగునో-కనుఁడీ-వేగఁగపాటుగాని. విను.

1 వినుఁడీ-యొక్కింత శాంతిఁ గనుఁడీ-సాక్షులగుమ నూరక
కనుఁడీ - మన గతి కొఱలు కర్తలనుచు యెల్లఁ గల్ల యని తెలియుఁడీ.
వినుఁడీ.

81 [25] మోహిని.

### తోడిరాగము-ఏకతాళము-మిశ్రగతి.

పావనహృదయా నా-పాలిదేవ నిన్గను-భాగ్య మెన్నటికైనఁ గాంతునా ?
పావన.

1 మల్లెలు మొల్లలు చేర్తునా ? - మంచిగ మాలలు కూర్తునా ? కొల్లగ
నీమెడ నుంతునా ? మోవి-కొసరి కొసరి సొక్కింతునా. పావన.

2 కోరి నీకౌఁగిట నుంతునా ? - కొదవు గుబ్బలచే హత్తింతునా ?
నేరమా యంచుఁ బ్రార్థింతునా ? నీ - సేనరునఁబట్టి సుఖియింతునా ?

3 వగలఁ దేల్చి మెప్పింతునా ? ని-ర్వ్యసనీయుగతుల సోలింతునా ?
పగలు రేలిటులు సేవింతునా ? నీవె-భగవంతుఁడంచు నుతింతునా ? పా.

87 [26] ### ఫరజురాగము-త్రిపుటతాళము-చతురశ్రజాతి.

మోహి—రాజేంద్రా ! యీవిధి తగునా ? యీ | నోజన న్విడనాడ
నగునా ? అహ. రాజేంద్రా.

రుక్మా—రాజాననా ! నిన్ను విడిచెదనా ? వి | భ్రాజితమదగజగమనా!
యెయుఁడు. రాజాననా.

మోహి—ఒంటిగ నన్విడిచి యొంటరివై నిలిచి | యింటికై చూచెదవే ! అహ. రాజేంద్ర.
రుక్మా—హరివాసరవ్రతము మఱచితిఁ గావున | హరి కరుణను వేఁడితి యెయుడు
రాజాననా.

---

ఈ 17 వ పాటను పంచమాంకములోని 4, 6, 8 పద్యముల ప్రారంభమందు వరుసగా ఒక్కొక్క చరణముచొప్పునఁ బాడవలయును.

92 [27] మోహిని.

ఫరజు రాగము—ఏకతాళము-చతురశ్రజాతి.

నాఁటిమాటలు మఱపాయెనా ? నేఁటికవెల్ల వెగటాయెనా? యల. నా.
వాటముగా సయ్యాటలనాడిన | మాటలెల్ల ఝూటాలాయెనా ?
యల, నాఁటి.

1 పాయని చెలిమెల్ల-పాయెను నిన్నుడఁ | బాయననుటయెల్ల పోయెనా ?
యల. నాఁటి.

2 పలుకు పలుకునఁ దేనె-లొలుకు ననెడి వాడు | పలుకులు ములుకు
లై సోఁకెనా ? యల. నాఁటి.

3 సంతసముగ భగ-వంతుని కథ లిపు | డంత వీనుల విందులాయెనా ?
యల. నాఁటి.

95 [28] a అఠాణరాగము-ఏకతాళము-మిశ్రజాతి.

రుక్మా—ఎంతగఁ బల్కి-తివి-కాంతరో ! వింతలాయె నేఁ. డెంత.

1 కంతుసుఖమే కోరి యొ-క్కింతయు యోచింపకయె | పంతగించి
నీవిటులఁ-వింత వింతలాడుచు నేఁ. డెంత.

మోహి—ఎంతటి ఘనుఁడవు-రాజా ! రవితేజా ! నీ. వెంత.

1 కంతుబారి కోర్వనంట-యింతి ! నినుఁ బాయనంట | యంతయుఁ
గలసె మింట-వింతలాయె నే నిట్లంట, నీ. వెంతటి.

రుక్మా— 2 ఆఁడవారి మాటలకు-నోడి వ్యర్థులైనవార | లేదులోకము
లలోన-నేఁడు నే నాఁడుఁగలరె. యెంతగ.

మోహి— 2 ఆఁడవారితోడఁ గల్ల-లాడి వారిఁగూడి యిట్లు మోడి
సేయువాఁడే నాఁడు-లేఁడా? యో రేఁడా ! తగు నీ.

రుక్మా— 3 కల్లలేమి కాదు ని-న్నొల్లననుటయు లేదు | అల్లనాఁడు
వ్రతము విడ-నొల్లనంట మఱచితి నేఁ. డెంతగ.

మోహి— 3 వంచనలు నీకే కాదు-మర్యాదయె మాయింటను | దొరల
కును మఱియు స్వార్థ-పరులకుఁ బామరులకును నీ. వెంత.

(ఈ 28 a b లలో నొకటిమాత్రము పాడిన చాలును.)

95 [28] b రుక్మాంగదుఁడు.

సురటరాగము—ఆదితాళము.

హే మగువయిటు-లగడు పలుకులను-మిగిలి పలికెదవె వహ్వావహ్వా!
ఈ మహిని భామ లిటు వ్రతములు-నోములను మాపగను జూతురె? హే.
1 బాలురును వృద్ధులును రోగులు భోగులును కుంతియును దోలఁగక.
చాలగను సల్పఁదగు వ్రత మిది-యేల యని చాలునని తెగడుము. హే.

111 [29] ధర్మాంగదుఁడు.

కాఫీరాగము—ఏకతాళము—మిశ్రజాతి.

జననీ! యీ పగ పేల? | పతంబె యీ-జగం బెల్ల?
కనుమీ దృశ్య మిదెల్ల | వినుమీ-నిల్చుట కల్ల. జననీ.
1 మున్ను జగతి-నెన్నో యుగముల్ | చన్న వనము-జననీ! వినవే?
ఎన్న వార-లెల్ల నేఁడు-నున్నారమ్మ? యూహింపుమా. జననీ.

114 [30] కమాచిరాగము-ఏకతాళము-చతురశ్రజాతి.

మోహి—తాళు తాళు రాజా!
రుక్మా—తాళజాలనే.
మోహి—తాళు తాళు రాజా? యిది తగవా?
రుక్మా—తాళనేటికి యింకనో మగువా?
మోహి—బిగువా? క్షణమైన నిల్వలేవా?
రుక్మా—నగవా-రడిగాదె యో మగువా?
మోహి—బాలు నిటు చంపకు.
రుక్మా—వ్రతము విడు మనకు.
మోహి—సెబాస్!
రుక్మా—పో.

120 [31] ధర్మాంగదుఁడు.

సురటరాగము—ఏకతాళము—చతురశ్రజాతి.

ఏల పల్కెద వీలీల? జననీ! నీ. వేల.
చాలు చాలు నిఁక వినఁ-జాల నిట్టి పల్కులు, నీ. వేల.
1 సామి నే మఱచి-సకలముఁ జెఱచి, మా | నీమము నిష్ఠ లివెల్ల-నీటఁ
గల్ప మనెదె? నీ. వేల.
2 యుక్తులు తెల్పి, దు-రుక్తులు పల్కి-, మా | భక్తిముక్తియెల్ల నేఁడు-
పాడొనర్ప మనెదె? నీ. వేల.

132 [32] అందఱు.

## సురటరాగము—ఏకతాళము.

మంగళము భూవరా-రుక్మాంగద మకుటధరా! అంగజజనకుని కృపఁగోని యాచం-ద్రార్కమైన కీర్తిగొనుమి జయజయ. మంగళము.

1 ధరను మదముఁగూర్చి, విబు-ధాళి నాదరించి, స-త్పురుషులఁ బోషించి, ముని-ముఖ్యులఁ బూజించి, మించి-సరసులెల్లరును సత్ప్రభుఁ డితఁడని-సకలగతుల విన్ను మెచ్చునట్లుగ-నరసి ప్రజల నేలుమయ్య శ్రీధ-ర్మాంగదావనీశ నీకు జయజయ. మంగళము.

[33] హనుమతోడిరాగము-రూపకతాళము-చతురశ్రజాతి.

దీనపోషకా! భక్తా - ధీనరక్షకా! | దానగుణ ని-ధానమోక్షసం-ధాన గావరా.

మానక నీ స్మరణమె యుప-మానరహిత మనుచుఁ దెలిసి - మానసమున నిన్పితి నిఁక-మాన మానసీయచరిత. దీన.

దళవద-నవివళ-నవిపు॰. దీన.

పరాక? మన-పరాద యిఁక. దీన.

కా-మితఫలద-శుభద. దీన.

రారారణ-శూరా కృతి-సారాసువి-చారావర.

2 ఆ పదల-బా పఁగల - ప్రాపనుచు-నీ పదము | దాపు-జేర | పా-పచ యము-లుడుపవె? దీన.

3 రానేల? గోపాల - నీపాలఁబడి తిర. | కోప మేల? గోప్కీలోల | కాపాడర కరుణాకర - తాపసార్చితాంఘ్రియుగళ. దీన.

4 దాసహృన్ని-వాసనన్ని-దోష పుంజముల నిడకు | మోసఁగాంద్ర వలలఁ దగిలి | యాసలఁబడి-వేసరిపడి-నీ సముఖము-డాసితినిర. దీన.

5 పంత మేల చేసెదు? భగ-వంతదాసపోషా | యావంతయైనఁ గరుణ లేద? సంతతాశ్రితావనచణ. దీన.

౨౩. స్వరజతి—మలయమారుతరాగము—త్రిపుటతాళము—చతురశ్రజాతి.

| | | |
|---|---|---|
| సా, రీ, గా,, పా, - దనిద | పా, - ,, ద ని | సని దప - గరిసని |
| కో, రీ, యు,, న్నా, - రవిట | రా,, - ,, యుడ | సదయుడ - వనినిసె. |
| సా, రిగ - రీ, గాప - గా పద | నీ, దాప - దని | దధప - ని దపగరి. సా. |
| రా, పేల - భూ, పాల - రూపర | నీ, పాల - బడి | తినిర - విడువకుర. కో. |
| ౧ గా,,,, - పగగరి - రి గరి స - సరి | గా,,,, - గప | ద నిద ప - గ రి స రి |
| గా,,,, - నరసిక - నినుగని - సరి | గా,,,, - సర | సుడవవు - దనుచును |
| గా,,,, - రీ, సానిద పగరి | గా,,,, - రి | సనిదప - ద ని స రి |
| గా,,,, - టం, బైనసుమశరు | గా,,,, - సి | నిదగిలి - నమయము |
| గా, - పదపగరి - గా, - నిదపగ రి | గా, - దని దధప | గా, - రి సనిసరి |
| గా, - నకవగవ - గా, - విధివశము | గా, - నిదియెతటి | గా, - దారకితివి |
| గా, - పగరిగా, - స ద ప గా, - ని | దపగా, - రిగా | , - పగా, - పగ రి. సా. |
| గా, - దనకగా, - వ్రుమటుగా, - క | విడగా, - జగా | , - నగా, - దన రె. కో. |
| ౨ పా,,,, - ద ని - సనిధప - గ రి స రి | గా,,,, - సరి | గ రి - రిగరి - సరిగ |
| పా,,,, - దము - లబడితి - రమలయ | మా,,,, - రుత | మున - కదరి - బెదరి |
| పా, - దనిదపా, - సిద నిపా, - ద | ని స పా, - దనిస | రీ, - గారి - స ని |
| పా, - డెదరపా, - టలనుపా, - వ | నకృపా, - మతివి | ప్రా, - ణేశ - నిను |

| | |
|---|---|
| దా, - ని దని - పని ద - ప ద ప - గప గ - రి | గరి - స రి స ని ద ప |
| బా,-యనుర-సదయ-హృదయ-గదియ-గ | దర - యిదె సమయము |
| గా పదాప - నీద - సా రిస నిదప | దా ని దాప - గప |
| ప్రా పు వేడ - వీడ - కూ డదుగదర | యూప రాని - వల |
| 3 సా, - స రి స స నిదా, - ద నిదధ ప | గా, - ప గప - రీ |
| క, - మ్మవిలుతుడు ర, - మ్మనసుపదు | న, - మ్ములను - జి |
| రీ గా,, - గపగరి రి గ - స రి గ రి | గ పా,, - గా |
| గాయ,, - శుకపికము - బలురొద | సేయ,, - తు |
| పా, దా, - దానిసరి స స ని - దని | సా స - రీ స - గా |
| మ్రో,య, - కోరిక లొసగుదు - వని | డాయ - వేజు - జే |
| రీ, - సని సదా, - నిద ని - ప గపధ | గా, - పగప రీ |
| సం, - తతము నం, - తనము - ననుభగ | వం - తుని గనెం |

### 34. స్వరజతి—చక్రవాక రాగము—ఆదితాళము.

| | |
|---|---|
| సా, నీ, దా, - నిదధప - పమగ | రీ, సా, రీ |
| సా, మా, నా, - మనవిని - విన వ | దే, మా, జా |
| సా, రి స ని - ద ని సనిద - దని ద పమ | గా, రీ, గా |
| నా, మి యని - యనుదినము - నినె గొలువ | గా, వే, గా |

| | |
|---|---|
| ౧ దా, - దని దధప - మా, పధ ప పమ | గా, - మపమమగ |
| దా, - నవహారణ - మా, నితసుగుణ | గా, - వ గదెశ బ |
| ౨ పా,,,, - ద ని దపమా,, - ప ద | పమగా,, - మప |
| పా,,,, - పహారణమా,, - మొఱ | వి నిగా,, - వ గ |
| గరిసా - స రిసనిదా - ద నిసరిగా | నిసరిగమా - గమ |
| నికసా - మజవరదా - యునిసరిగా | దలచితిమా - మశ |
| 3 సా రిగరిస - ని రిసాని - ద నిపదని | సా, ని ద ప - మప |
| శామితవర - దుడవీవె - యనిమదిని | సా, మిక్రృప - ని డి |
| గా, రిరిస - ని రిసాని - దని స రి గ | మా, - ప దనిద ప |
| గా, ధలను - దెగటార్చి - ననుమనుపు | మా, - మదినిలుపు |
| మాప ద - నిని ద ధ ప మ-పమగ మాపద | నీ - దనిసా - ని స |
| మాయని - యనుదినమును - తవమృదుపద | నీ - రజనీ - వమొ |
| ద ని సరిగా,, - రిస ని సరీ,, | స ని ద నిసా ని ద |
| మొఱలిడగా,, - వినవహారీ,, | యిటుమనసామఱ |

ధ ని ధ రి - ప గగరి
మాదమున - మదవతి
ద నిదప - గ రిసని. సా.
పునబడి - నినెమని. కో.
, - గ రిగసా - ని స
, - మ్మగను వె - న్నెల
ప నిద ప - గారి గ
మ్మొదగమి - జమ్మని
రి - గాప - గారిస
యు - మేర - గాదుర
, గ ధ పగ రిసని సా.
, తయుమది దెలిసి. కో.

, గా మా ప ద ని. సా.
, లంబే మియిటు. సా.
, సరి గమ ప ద ని. సా.
, రవమున మనుప. సా.

రీ, - గమపదని. సా.

రీ, - ప్రణుతపద. సా.

మగరీ,, - గమ

నెవరీ,, - భువి

పా - మగమప దని. సా.

ప్రా - ర్థనగో నెదని. సా.

ద నిదప - మ ధ ప మ

కడువడి - యఘుచయ

మా, - ప సనిద ప

మా, - కృపనలుపు

రీ - సరి ససాని

శ్రీ - కరమటంచు

పమ - గమపా దని. సా.

వగ - భగవంతుఁడ. సా.

# 35 తానవర్ణము-ముఖారిరాగము-ఆదితాళము.

ప్ర. శ్రీవిజయవాడ పురాధీశా! (అను.) భగవంతదానపోష! చ. పాపవినాశా! పరమేశ.

| | | |
|---|---|---|
| ససానిదప - సని దప - మపమగరిస | రీ,, - ,, రిమ | పనిద - పదమపద |
| శ్రీఈఇవిఇ - జఅయఅ - వఅఅఅఅఅ | డ,, - ,, అఅ | అఅఅ - అఅఅఅఅ |
| నిదాప - మపధస - నిదాప - మగరిస | ధసా - దసరిగరి | మగరి - సరిమపద |
| పుఊఉ - ఉఉఉఉ - ర అ అ-అఅఅఅ | ధిఈ - ఇఇఇఇఇ | శఅఅ - అఅఅఅఅ |
| అ. పా, - మపధ - మపధప - మపమగరిస | దా, - సరిస - ధస | సరి రిమ మప పద |
| భ, - అ అ అ - గఅఅఅ - వ ం ం ంంం | త, - అఅఅ - దఅ | అఅఅఅ అఅ అస |
| పా, - ధస రిగరి - మగరి - పమగరిస | రి రీ సనిద - సని | దప - మగ రిమపద. |
| పో, - ఒఒఒఒ - షఅఅ - అఅఅఅఅ | శ్రీఈ ఇఇఇ - నఅ | అఅ - గ అ రెఎ ఎశ. |
| సానిదా, - స ని దా - మపధ - మపమ | ధా, పా, - మని | దప - మప మగ రి స |
| శ్రీరమా, - హితమా - నితమ - హితసు | ధా, మా, - సను | గృప - గ ని మనుపుమ |
| మా, గ రి స - పా, మ గ రి - రిమపధ | పా, పాధ - మా | , పా ధ - పనిద స |
| మా, నుపుమ - బా, ములను - శ్రితజన | సం, తాన - నీ | , ధ్యాన - పటిమను |
| నీ, దాప - గా, రీస - నీ, ద | , ప - గా, రీస | రీమపా - ధ సరి |
| సం, ధించు - గా, రీశ - షా, . | , శ - వా, ణీశ | సేవితా - దురిత |

| | | | |
|---|---|---|---|
| | మగారి - సరిపమాగరిస - సనిధప | రిసానిదప - ధప | , మగ - రీమపద. స. |
| | వినాశ - నినువి నాగతిని - గననుర | ధరాస్థలిని - దొర | , విను - రాజధర. శ్రీ. |
| చ. | పా, ద - మప - నిసి దధ పప మమ గరి | సా,, - దా, స | ,, - రీ, మామ. పా. |
| | పా, ప - వి ఇ - ఇఇ ఇఇ ఇఇ ఇ ఇ నఅ | శా,, - వ, ర | ,, - అ, మేశ. పా. |
| ౧ | పా, మా, - సీ,, - దా, ప - ధరి | సా, - సీ, దా | , పామాగ - రిమ. పా. |
| | ఈ, శా, - క్రై,, - లా, స - గిరి | శా, - వి, శ్వే | , శాపాహి - నమ. పా. |
| ౨ | స రిమ - రిమప - మపద-పధన-ప దస రి | మగరి - సనిధ - సని | ధ ప-పమగరి-రిమ. పా. |
| | సుగుణ-ధ రణ-భరణ - నిపుణ - భవభయ | హరణ - చరణ - నుత | గుణ-విత రణ-చణ. పా. |
| 3 | పా, - పమ గ రి మపా, - రిమస రి మ | పా, - ధ పధపమ | పా, - నిద నిపధ |
| | పా, - పభయమునుపా, - అదరుమును | పా, - యమనితవ | పా, - దభజనమ |
| | పా, నిదపదసపా, - ధ రి స నిద | పా, - గరిస నిద | పా, - పద సరిమ. పా. |
| | పా, రగతినురపా, - లముఖశ్రిత | పా, - ళిసలుపరె | పా, - వనచరిత. పా. |
| ౪ | సీ, దా, పా, మాప - మాపమ | సీ, దా, మా | , పా ధ - మపధస |
| | పా,లా, రా, పే ల - శా ల వి | ఫా, లా, చి | , ద్యుతి - వి ల సిత |
| | సీ, దా, - గా, రీ స - సరి ధరి | సీ, దా, - మా | , గ రిస - రి మ పధ |
| | ఫా,లా,-మాం పాహి - శ్రితపరి | పా, లా, - న | , మ్మతిర - ప్రణమిత |

నీ, దా - మా, దా మగరి - స
భూ, పాల - గో, పాల వినుత - హ
రీ, - సనిద - గా రి సనిద - ప ద స రి
రా, - కటర - కోర్కెలిడర - కలుషహ
రీ,,-,, సరి గరి రిగ - స రి ధ రి
శ్రీ,,-,, కరశుభకర - పురహర
రీ, రి గ సా, - రి గసా - రిగ
శ్రీ, త్రియక్ష్ర, - త్యక్షి - క్షిత
నీ, ద - గా, రి - పా, మ - గ రిస ని
హా, ర - ధీ, ర - ఘో, ర - భవభయ
ని రి-సమ-రిప-మధ-పని-ధ స-నిరి-ధరి
సుర-వ ర-నుత-నగ-ధర-హిత-గిరి-కృత

మా, రి పా, - మ
రా, దొరా, - ప
మా, - గ రి సా - ని
రా, - యుమరా - జ
సా,, - ,, ని ద
సా,, - ,, మిక
సా, ని ద - మా
, ద, తాజ - గ
ని దా - ధ పామ
హరా - హరాార
సా, - పా, సా
చా, - పా, సాం

ధా, - ప సా, - ని
రా, - శ్వరా, - ప
దమా-గరిస-రిమ. పా.
ధ రా-నగర-టర. పా.
మా - పదసా - రి గ
మా - పతిసా - యుక
, పాద - మపధ స
, ద్రక్ష - ప ణకృత
, - మగా - గరిసా
, - నరా - గదరా
,, - సరిసా - రిమ. పా.
,, - బనదా-శి వ. పా.

౨ పాపపపప - మపమ - గగమ - రీ గమ
సాదరమతి - బ్రోవవ - వళయ - తోషిత
దాస - నీ స - దాని - దావ - రి గమప
శాద - యాని - ధే ర - మే శ - లోబకెఎ
గామపా ని - నీన్ని పా - పపనిసా
నాదుకోర్కె - దీర్ప వే - పరమధ
రిగమపదని - స స రి - రిసనిపా - పని
నఅద రంబు - సెఎయ - మెఎరయే - పసి
3 గామపపప - నీ ప - సానినిప - ని స
ఎన్నిగతుల - నిన్నె - వే డితిర - తుద
గామ - దాద - నీద - దాప - ద నిసరి
క న్న - తండ్రి - గావ - రార - యికనిఇ
రీ మ పాని - మాప నీ ని - సససా
చిన్నపాప - మే ఘువాహ - నుత నీ
పాప - నీ స - రీ స - స ని ప - మపని స
చిన్ని - మోము - జూపి - బోఒవు - కరుణను

పధపసా, - పప
శం క రా, - భర
ధా, పా, - రి గ
శా, నా, - మన
రీ,, - ,, సా
న్యా,, - ,, సీ
నరి స - నిసని - పని
నఅట - నుండి - నిఇ
రీ, సనిప - పమ
కే, దఅరి - జుఉ
నరి స దాప - పమ
కఅన్న డాయ - గఅ
నీ సరీస - సా
చెంత జేరి - వే
రీ, (సని)పా, - పని
శ్రీ, శా, - భగ

మ - గగమ - రిగమప
ణ - నిపుణ - శ్రిఇఇఇ
మప నుప - గా,మరిస
వి ని వి ని - వే, ఎఎఎ
,, - నిసనిధపమ
,, - తఅరమణఅ
ప—మపమ.గమపని. సానీ.
న్నె—వెఎడు—చుండగ.సామీ
గ రీ — స గారిస
పెదో—కృపాకర
ప — గా మ — రి గ రిస
మ్యా—మొందు—గఅఅన
రి — సనిద — మపనిస
యు—చుందు—సురటిఇ
పాపమ—రి మపని. సానీ.
వత్క—వి—పోఒమక.సామీ.

# ఉపన్యాసమంజరి.

పద్యగద్యాత్మకము 170 పుటలు.

| | | |
|---|---|---|
| మొదటి భాగము | ... | 0-9-0 |
| రెండవ భాగము | ... | 0-9-0 |
| రెండుభాగములు కలిసి ప్రతి | | 1-0-0 |

## — పత్రికాభిప్రాయములు —

### అభినవసరస్వతి, జానపాడు, 1-12-13.

... ఇప్పుడు సాహిత్యపారిశ్రామిక సంఘముల సంస్కారణమును బూని యీ గ్రంథమును బ్రకటించినట్లు కనఁబడుచున్నది. ఇందు దేశోద్ధారకులు, కవులు, పత్రికాధిపతులు, ఉపన్యాసకులు, చిత్రలేఖకులు, గానము, వాద్యము, ఆంగ్లభాష, విద్యార్థులు, వ్యాయామము, వ్యాసలేఖనము (కాంపొజిషన్) మొదలగు నిరువది విషయములు చక్కఁగా జర్చింపఁబడినవి. ఇందు కవిజన విద్యార్థిజన సంస్కారణములు మిక్కిలి ముఖ్యములని మా యభిప్రాయము. వీరు లోకమును బ్రమాణముగను, హేతుజ్ఞానము నూతగను జేకొని దీనిని స్వతంత్రమగు లక్ష్యగ్రంథముగ రచియించిరి. ఇట్టి కార్యము ప్రకృతకాలపుఁ గవులం దపూర్వముగనే యున్నది. ఇది నవగ్రంథమే యైనను లక్ష్యప్రాయమగు భాగములును వివాదాంశములును పద్యములుగఁగూడ వ్రాయఁబడినవి. ...

---

### శశిలేఖ, చన్నపట్టణము, 3-3-14.

ఇందు దేశోద్ధారకులు...లోనగు నిరువది విషయములు చక్కఁగఁ జర్చింపఁబడినవి. ప్రతివిషయమునందును నవీనమార్గము లనేకములుగఁ జూపఁబడినవి. ... శైలి మృదుమధురమై, హేతువాదభరితమై చదివినకొలఁదిని చదువవలయు ననిపించును. ఇంతయేల! దీనిలోని రెండుపద్యములఁ జదువుఁడు. అంతను జదివెదరు! ప్రతి యాంధ్రుడును దీని జదివి మేలు వడయునుగాక యని కోరుచున్నాము.

---

### ఆంధ్రపత్రిక, బొంబాయి, 12-11-13.

ఈ గ్రంథములో వివిధవిషయికములగు నిరువది విషయములు కలవు. విషయౌచిత్యధర్మము నేర్పునట్లుగ వచనమున సులభశైలితో రచియింపఁబడినది.

---

## పండితాభిప్రాయములు

కొప్పరపు సోదర కవులు, శతావధానులు. కొప్పరము, 16-12-13.

మిత్రమా ! మీ యుపన్యాసమంజరి నేఁటికిఁ బూర్తిగఁ జూడఁ దటస్థపడినది. ... అందలి యెల్లయంశములును లోకోపకారకము లనుటలో సంశయము లేదు. ... సర్వ విధముల మీకృతి స్తుతిపాత్రమనియే మా యభిప్రాయము.

గీ. తగును విద్యార్థులకు నుపా ♦ ధ్యాయులకును
జదువఁ జదివింప, నామోద ♦ మెద గ్రహింప
మీ యుపన్యాసమంజరి ♦ మృగులతావి
భాసితం బౌట నో భగ ♦ వత్కవీశ !

---

తిరుపతి వేంకటేశ్వర కవులు.

ఆర్యా ! తాము పంపిన ఉపన్యాసమంజరి 1-2 భాగములలోని పలువిషయములు యథావకాశముగ స్థాలీపులాకన్యాయముగఁ జదివి చర్చించి చూచితిమి. చాలభాగము దీన నుండు సంగతులు సంస్కృతమునఁ గలవియైనను ఆంధ్రమున నూతనము లనుటకు సందియము లేదు. ... మీప్రయత్న మితరులకు దెలుఁగులో మార్గప్రదర్శకమని నొక్కి వక్కాణించుచున్నారము.

---

ముత్తరాజు సుబ్బరావుపంతులుగారు, ఎం. యే. బందరు, 17-11-13.

ఆర్యా ! తమ రంపిన యుపన్యాసమంజరిని సాంతముగాఁ జదివినాఁడను. ఆ గ్రంథమంతయు సులభశైలిని సర్వజనులకు గ్రాహ్యమగునట్లుగా వ్రాయఁబడియున్నది. అందుఁ జేర్పఁబడిన యంశము లన్నియు యుక్తియుక్తముగాఁ జర్చింపఁబడియున్నవి. ఆ గ్రంథము కాలేజివిద్యార్థులకును, విద్యాధికులకును బఠనీయమని నాకుఁ దోచుచున్నది. మీ యభిప్రాయము లన్నియు సమంజసములై సంఘపురోభివృద్ధికి మార్గదర్శకములుగా నున్నవి.

---

అత్తిలి గురుమూర్తిపంతులుగారు, బి. యే., యల్. టి.

Dear Sir,

Let me thank you for the copy of the Upanyasamanjari' you have kindly sent me. I have gone throgh the whole book and I find in its pages much valuable and original matter. It is not only

a useful book in the hand of the young man at school, but it suggests new ideas on some important subjects even to the adult.

The essays on 'Students,' 'Physical Culture,' and 'Essay-writig' are of special interest and value to the student population, while the series on 'The Uplifters of a Nation' cannot fail to arrest the attention of the grown up reader and give him much food for thinking.

Hoping that the literate Andhra public appreciate and encourage original works like this,

Let me remain!
Yours very sincerely.

---

V. G. Kristna Iyengar. M. A., L.L.B. Edin,
Barrister at Law.

Mr. Betapudy Bhagavanta Rao was good enough to send me a copy of his 'Upanyasamanjari' for opinion.

I have just gone through its exceedingly interesting and instructive pages fully and am indeed struck with the force and lucidity of the learned author's style and the breadth of his imagination. The book consists of essays on a variety of subjects and the author by the publication of this book has done incalculable service to Telugu literature of the kind. He is undoubtedly well deserving of public patronage.

---